Best Compliments
Nataraj Ramakrishna

# అమ్మ

## శివరాత్రి - శివతాండవము

### మాతాజీ - బాబూజీ



( శ్రీమతి కమలారాణి సంఘి - శ్రీ రామ్‌శరణ్ సంఘి )


రచన:

పద్మశ్రీ, భరత కళాప్రపూర్ణ

**డా॥ నటరాజ రామకృష్ణ**

# అమ్మ-మాతాజీ

'**అమ్మ**' అన్న రెండు అక్షరముల మాటలో ఎంత మహత్తు వుంది. అది అమ్మ వున్న వారికి గాదు అమ్మను పోగొట్టుకున్నవారికి తెలుస్తుంది.

మా అమ్మ నాకు ఊహ తెలియని నాడే నన్ను వదిలి వెళ్లిపోయారు. అమ్మ ఏదని అడిగితే, ఆమె దూరంగా వెళ్లింది వస్తుందనే వారు.

అమ్మను నేను చూడలేదు. నాతోటి పిల్లలు వాళ్ల అమ్మను 'అమ్మా' అని ఆప్యాయతతో పిలుస్తూ - అమ్మ వొడిలో తలదాచుకొంటుంటే నాకు ఏదో చెప్పరానంత బాధగా వుండేది.

అమ్మయెలాగుంటుంది? అని ఒక ఆలోచన కలిగేది. కొందరనేవారు- మీ అమ్మ అచ్చం నీలాగే వుండేది. నీ కంటే ఒక పిసరు రంగు ఎక్కువ అని ఒకరు. ఆ కండ్లు నీవి, అచ్చంగా మీ అమ్మ కండ్లే, నీ కళ్లు చూస్తే ఆమె జ్ఞాపకం వస్తుంది. అని మరొకరు.

మీ అమ్మ కంఠం ఎంత తీయగా వుండేదనుకున్నావు.

ఎంత సంగీతం అభ్యాసం చేసింది. కవిత్వం రాసేది ఎంత పెద్ద చదువు ఎన్ని భాషలు చేర్చుకుంది.

కాని అంత విద్య నాలుగుగోడల మధ్యకే పరిమితమై పోయింది. పెద్దింటి ఆడవారు పర్దాలో నుండి బయటకు రారు గదా! అమ్మను ఈ మాదిరిగా ఎందరెందరో ఎన్నో రకాలుగా వర్ణించేవారు. ఇంతకూ అమ్మ రూపాన్ని నేను చూడనే లేదు.

అమ్మ వస్తుంది - వస్తుంది - అని ఆశించాను. ఆఖరికి -

ఒక దీపావళి నాడు మా యింటి పెద్దలు పండ్లు, మిఠాయిలు, పువ్వులు, దీపజ్యోతులు పట్టుకొని అమ్మ సమాధి వద్దకు వెళ్లి పూజలు చేశారు. ఆ రోజు

తెలిసికొన్నాను.

అమ్మ నాకు లేదని - ఇక తిరిగి రాదని...

అమ్మ రాదు... రాదు... రాదు..

ఆశ నిరాశ అయింది.

ఆ రోజు నుండి నేను ఒంటరితనం అలవాటు చేసుకున్నాను. ఒంటరిగా ఒకచోట కూర్చొని అమ్మను తలచుకుని బాధపడేవాణ్ణి.

x x x

నాకు ఊహ తెలిసిన నాటి నుండి ప్రతి స్త్రీ మూర్తిలో మాతృమూర్తిని చూడ్డానికి ప్రయత్నించాను. 'అమ్మా' అని వారిని పిలిచి సంతృప్తి చెందడానికి ప్రయత్నించాను.

వారూ నన్ను తమ బిడ్డగా ఆదరించే వారు, అభిమానించేవారు.

కానీ- కానీ-

అప్పుడప్పుడు ఏదో లోటు... అసంతృప్తి...

మా అమ్మే అయితే యిలాగే చూచేవారా? అని సందేహం. మరెలా చూడాలి? - నాకే తిలియదు. మరెందుకో కొంత లోటు అనిపించేది.

అది ఆ అమ్మల లోపం గాదు. నా లోపమే అనుకుంటాను. వారి నుండి నేను ఏవిధమైన ఆదరణ పొందాలో నాకే తెలియదు.

నేను పెద్ద పెరిగాను. నృత్య కళాకారునిగా ఎనలేని కీర్తి గడించాను. సన్మానాలు పొందాను. ఆ సమయంలో-

నా హృదయం 'ఇప్పుడు అమ్మే వుంటే' అని కొట్టుమిట్టులాడేది.

నాకు ఢిల్లీ సంగీత నాటక అకాడమీ వారు అవార్డు యిస్తున్నట్లు లేఖ వ్రాశారు. ఆ లేఖ ఈ అమ్మకు చూపాలని నా ఆత్మ ప్రభోధం చేసింది. కారు చేసుకొని కొండమీద

సంఘీనగరం వెళ్లాను -

అమ్మను బాపూజీని కలిసుకున్నాను.

"మాతాజీ నాకు అవార్డు ఇస్తున్నారని తెల్పుతూ" నమస్కరించాను.

మాతాజీ హృదయం పొంగిపోయింది.

అమ్మను మాతాజీలో మొదటి సారి చూచాను.

మాతాజీ ఆత్మీయతతో నా తలపై చేతులనుంచారు. ఆ హస్తాల్లో నుండి మాతృప్రేమ, ఆత్మీయత నాపై వర్షించాయి. నాటి నుండి నా తల్లి లేని లోటు తీరింది."

ఆత్మ సంతృప్తి చెందింది.

అమ్మ ఆప్యాయత అంటే ఏమిటో యిలాగే వుంటుందని నాడు తెలిసికొని

అమ్మకు, బాబూజీకి ఈ చిన్ని గ్రంథాన్ని సమర్పిస్తున్నాను.

హైదరాబాద్ - 20

తేదీ: 19-2-2002

తల్లి సరస్వతి సేవలో

**నటరాజ రామకృష్ణ**

# శివరాత్రి - శివతాండవము

"శివ శివ శివ శివ శంభో శంకర
పాహిమాం - పాహిమాం - ఉమాపతి"

అయ్యా! శివయ్యా నీ పేర జరిగే ఈ శివతాండవాలు జూచి ఎలా భరిస్తున్నావు తండ్రీ! ముక్కు పచ్చలు ఆరని ఆడపిల్లలు గూడా శివతాండవము ఆడెయ్యడమే - శివతాండవం ఎంత చవుక అయిపోయింది. మంచి నీళ్ల మర్యాదలాగా...

నేను: అమ్మా! కల్పవల్లీ కామాక్షమ్మా మీ టీ.వి. కాస్త కట్టేస్తారా. ఇలా అంటారనే గదా నేను ఆ ప్రదర్శనాలకు వెళ్లపద్దన్నాను. నా మాట వినకుండా వెళ్లడమెందుకు - ఈ ఆవేదన మెందుకమ్మా పండగపూట.

అమ్మా: ఏదో ఇవాళ్ల శివరాత్రి గదా దినమంతా ఉపవాసమున్నాను. శివాలయానికి వెళ్లి - అక్కడ ప్రక్కనే గదా - ఆ ప్రదర్శన చూడ్డానికి వెళ్లా - నీ మాట విననందుకు అలనాడు శివుని మాట వినకుండా దక్షయజ్ఞానికి పరుగున వెళ్లి - భంగపడిన దక్షాయనికి జరిగిన మర్యాద జ్ఞప్తికి తెచ్చుకున్నాను.

నేను: ఇంతకు అంత ఘోరమేమి జరిగిందమ్మా?

అమ్మా: కాదు గాని అబ్బాయి శివుడు వ్యాఘ్రుంబర ధారి, గజచర్మాంభరధారి అని వర్ణించారు పురాణాల్లో

"పాల సముద్రము తెలుపు
పార్వతీ పతి తెల్పు - అన్నారు.

మరి శివునికి ఆ నీలం రంగేమిటిరా? శ్రీ కృష్ణునిలా, అంబకు ఎఱ్ర రంగులు పులిమేశారు. ఇక ఆటంటావా వర్ణించలేను. శివతత్వం తెలుసుకునే ఆడుతున్నారంటావా? శివతాండవమంటే ఎగరడం, గెంతడం, దూకడం, గెంతడం, గిరగిరా తిరగడం ఇంతేనా? శివుని సాత్విక, స్వరూపుడని కూడా అంటారు. ఆయన సత్వగుణ సంపన్నుడు గదా!

నా దృష్టిలో... సృష్టి స్థితి, లయల్ని తెలిపే - ఈ తాండవం అన్నిటి కంటే అతికష్టమైందిగా అనుకుంటాను.

**నేను:** మరి ఎలాగుండాలంటావు.

**అమ్మా:** అలా అడిగావు బాగుంది. శివుడు ఎన్ని తాండవాలు ఆడాడు. ఏడు రకాలని గదా గ్రంథాలు చెబుతున్నాయి. ఏఏ తాండవము ఎలా వుండాలి, ఎలా ఆడాలి కథా వస్తువేమిటి ఇవన్నీ ఆలోచించాలా వద్దా? ఏమీ తెలిసికోకుండా పులి తోలు దొరకలేదని రంగు గుడ్డ కట్టుకుని జుట్టు ఎగదువ్వి కొప్పులో చంద్రున్ని పెట్టుకుని, ఒకరు శివునికి మీసాలు పెడితే మరొకరు నున్నగా క్షవరం చేసుకొని, మరొకరు గడ్డాలు మీసాలు పెట్టి ఇలా ఆడేయడమేనా? ఇంకొకటి జూస్తున్నా.

ఈ నాట్యం ముగింపులో - డోలు, డప్పులు, మద్దెల్లూ, ఘంటలూ అన్ని ఒకేసారి ఉధృతంగా చెవులు గింగురులెత్తేలాగున గిరగిర ధరధారా ధిమిధిమి అని మ్రోగిస్తుంటే..

శివయ్య పాత్రధారి ఒంటి కాలి మీద నిలబడి గిరగిర గిరగిర గిరాగిరా తిరుగుతూ ఆడేస్తున్నాడు - చూచే వాళ్లందరూ చప్పట్లు కొట్టే వరకూ - అప్పుడు తెరపడి పోయింది. నేను యింటికి వచ్చాను.

**నేను:** అంత పెద్ద సభలో నీ వొక్క దానివే తపించిపోతున్నావా? నీ కింకెవరైనా తోడయ్యారా? అమ్మా, మనస్సులో బాధ ఎవ్వరికైనా చెప్పుకుంటే కొంత ఉపశమనం వుంటుందని మన పురాణాలు ఘోషిస్తున్నాయి.

**అమ్మా:** పురాణాలు మాట దేవుడెరుగు గాని మా చిన్నతనంలో మన యింటికి ఒక మంచి పౌరాణికులు వచ్చేవారు. ఆయన శివభక్తులు నొసట విభూధి రేఖలు అందులో మధ్యలో కుంకుమ బొట్టు - చెవులకు మకర కుండనాలు, మెడలో రుద్రాక్షమాలలు, చేతులకు సింహ తలాటాలు, జరీపంచ, బిల్లగోచి పెట్టి కట్టి, కాశ్మీరు శాలువా కప్పుకొని, చేతిలో శివపురాణంతో దర్శనమిస్తే అచ్చం పరమశివుడే కైలాసం నుండి దిగివచ్చాడా అనిపించేది. ఆ పవిత్రత నేడు కనిపించదే అదే బాధ మనస్సు తరుక్కుపోతుందనుకో.

**నేను:** అమ్మా! ఏడు తాండావాలు అన్నావు? తరచూ ఏమిటో ఏమిటో అంటుంటావు. కాస్త వివరంగా చెబుతావా?

**అమ్మా:** వినడానికి ఓపిక వుందా? నీవు నాట్యం నేర్చుకుంటున్నావు గదా? పెద్దయ్యాక ఆచరణలో పెట్టాలి. చెప్పుతాను వినూ ఆ మాత్రం చెప్పలేనిదానికి యితరులను విమర్శించే హక్కు యెక్కడిదిరా? నా పిచ్చితండ్రీ!

సరే గాని ప్రొద్దునుండీ ఉపవాసం, శివయ్యకు హారతిచ్చి ఒక్కపొద్దు విడుస్తాను. మళ్లీ 'లింగోద్భవ' సమయానికి గుడికి చేరుకోవాలి

**నేను:** మనలో మనమాట అడుగుతాను - అమ్మా మరి నీవెప్పుడైనా నాట్యం నేర్చుకోలేదా!

**అమ్మా:** అంత అదృష్టమే. మా కాలంలో ఆ మాట యెత్తితే యెంత తప్పు. కానీ! చిన్న తనంలో ఎన్నో యక్షగానాలు జూచాను. వారు శివపురాణ గాధలను ఎక్కువగా ఆడ్డంజూచాను. వీధి భాగవతులు, వీధి నాటకాలు, ఆడేవారు వచ్చేవారు. మన యింటి ముందే ఆడేవారు. మన గొడ్ల చావిడి ఖాళీ చేసి యిచ్చే వారు మా నాన్న గారు. అందులో వారు వంటలు, భోజనాలు విశ్రాంతి తీసుకునేవారు.

వారు ఆటలాడి సంపాదించింది మా నాన్నగారి దగ్గర దాచిపెట్టుకుని తిరిగి వెళ్లేటప్పుడు లెక్క జూచుకుని పట్టుకుని వెళ్లేవారు. వందో, యాభయ్యో నాన్న గారు ముట్టజెప్పేవారు. మా అమ్మగారు వేషం మీదకని అడిగితే చీరెలు, రవికలు, గుడ్డలు, యిచ్చేవారు.

వారి ఆట పాటలు సాధన తీర్లు చూచే అవకాశములుండేవి. అందువల్ల నృత్యం, సంగీతం గూర్చి ఎంతో తెలిసికున్నాను.

**నేను:** మరి అమ్మా! నీవు ఇంత చక్కగా ఎలా పాడగుల్గుతున్నావు?

**అమ్మా:** అదా - మా అమ్మగారికి సంగీతమంటే ఎంతో యిష్టం. ఆధ్యాత్మ రామాయణం, మోక్షగుండ రామాయణం, భద్రాద్రి రామదాసు కీర్తనలు, తూము నరసింహాదాసు కీర్తనలు, ఎడ్ల రామదాసు కీర్తనలు ఎలా ఎన్నో ఆమె పాడేవారు, నేర్పేవారు. ఇంతేగాదు - సీతమ్మ వారి వేవిళ్లు, లక్ష్మణ స్వామి మూర్ఛ,

సీతారాముల వామన గుంటలు, ఊర్మిళ దేవి నిద్ర - సత్యభామ అలుక, బంతుల పాటలు, నలుగు పాటలు, వదినె మరదల్ల వరుస పాటలు, జోల పాటలు, లాలి పాటలు, ఇలా ఒక్కటేమిటి ఇలా ఎన్నో చెప్పించారు. గొబ్బి పాటలు, బతుకమ్మ పాటలు గూడా.

**నేను:** గొబ్బి పాటలు సరే, బతుకమ్మ పాటలు తూర్పున ఉన్నదానివి నీవెలా నేర్చుకున్నావు.

**అమ్మా:** కొలనుపాక గ్రామంలో మా పెత్తల్లి వారు ఉండేవారు. అక్కడ ఒక శివాలయం వుంది. జైన మందిరం వుంది. ఒకసారి వారి యింటికి వెళ్లాను. బతుకమ్మ పండుగలప్పుడు అక్కడ ఆడవారు ఆడే ఆట చూచాను. పాడే పాట విన్నాను. అదేదో క్రొత్తగా వుండేది. తిరిగి వచ్చేటప్పుడు రెండు పాటలు నేర్చుకొని వచ్చాను.

**నేను:** మరి త్యాగయ్య కృతులు, అన్నమయ్యల మాటేమిటి?

**అమ్మా:** ఆ కాలంలో త్యాగరాజు అంత ఎక్కువగా ప్రచారంలో లేరు. అన్నమయ్య ఈ మధ్య ప్రచారంలోకి వచ్చారు.

**నేను:** మరి ఏ ఏ దేశాలు జూచారు.

**అమ్మా:** నాకు మీ నాన్నతో పెండ్లి కాక ముందు, మా నాన్న మీ తాతగారు కన్యాకుమారి మొదలు కంచి, శ్రీ కాళహస్తి వరకు తీసుకుని వెళ్లి ఎన్ని దేవాలయాలు చూపించారో లెక్క లేదు. తంజావూరులో ఉండగా ఒకనాటి రాత్రి రాజరాజచోళుడనే రాజు కట్టించిన బృహదీశ్వర ఆలయం వద్ద. కురవంజి ఆట ఆడింది ఒక అమ్మాయి, వయసులో ఏమంత పెద్దది గాక పోయినా ఏమి పాడింది, ఏమి పాడింది ఎన్ని రాగాలు... ఆలాపించిందనుకున్నావు. చెవుల తుప్పు వదిలిపోయిందనుకో.

ఇక పెండ్లి అయింతరువాత మీ నాన్న గూడా ముఖలింగం నుండి ధర్మపురి నరసింహ క్షేత్రం వరకూ తీసుకు వెళ్లారు. క్షేత్రాలన్నీ చూపించారు. అప్పుడే మన ఆంధ్రలో వివిధ ప్రాంతాలు, వారి కట్టు, బొట్టు తీరు, ఆచార వ్యవహారాలు మాట్లాడే భాష తీరులు - భోజన పద్ధతులు, వంటలు అన్నీ ఆ మారాజు దయవల్ల తెలిసికోగల్గినాను.

తెలంగాణ ప్రాంతంలో బహురూపులు, భరతుల ఆట పాటలు చాలా చిత్రంగా తోచేవి. భాష, ప్రాంతీయ యాస ఒక్కొక్కసారి అర్థము చేసుకోవడం కష్టముగా కూడా వుండేది. ఇంత దేశం జూచాను. కళల గూర్చి తెలుసుకున్నాను. కానీ నా చిన్ననాటి కోరిక తీరలేదు. అందువల్లే నీకు నాట్యం నేర్పిస్తున్నాను నీ ద్వారానైనా తీర్చుకోవాలని.

**నేను:** మరి కొందరు ఆడపిల్లలకు గాని - మగ పిల్లలకు నాట్యమెందుకని హాస్యం పట్టిస్తుంటారు.

**అమ్మా:** వారి పెద్దలను ముద్ద మందారాలతో పూజించా - వారికేమి తెలుసు శివుడు, బ్రహ్మ, విష్ణువు వీరందరూ మగవారేగా!

**నేను:** (సన్నగా) మరి అర్జనుడు

**అమ్మా:** అదొక శాపగ్రస్త జీవితంలే

**నేను:** అమ్మా ఇంత చర్చించావు. నా చేత ఎప్పుడు 'ఆరంగేట్రం' చేయిస్తావు. అని అందరూ అడుగుతున్నారు.

**అమ్మా:** "అరంగేట్రం" ఏమిటిరా రంగ పూజ, రంగప్రవేశం అనలేవు. నిన్ను చిన్నబుచ్చను గాని నీలో శివతత్వం పూర్తిగా జూచిన రోజున వెంటనే చేయిస్తాను.

ఇలా మా అమ్మ కల్పవల్లి కామాక్షమ్మతో శివరాత్రి రోజు - శివతాండవ చర్చ ముగిసింది.

x x x

మా అమ్మ నేను నా ఆరంగేట్రం 'సారీ.. సారీ..' క్షమించాలి రంగపూజ, రంగ ప్రవేశం గురించి అడిగిన రోజు - ఆ రోజు శివరాత్రి.

ఆనాటి నుండి - మా తాత గారి తాళపత్ర గ్రంథాలన్నీ భోషాణం పెట్టిలో నుండి తీసి, దుమ్ము దులిపి చదవటం మొదలుపెట్టింది.

శివుడు అంటే అతని తత్వమెట్టిది?

విష్ణు తత్వ మంటే ఎలాంటిది?

వీటి రెండింటిని గూర్చి ఆమె పారాయణ, పఠన, పరిశోధన -

నాకు నాట్యం నేర్పించినప్పుడు నేను చిన్నవాన్ని. ఒక్కణ్ణే కొడుకును. అచ్చట, ముచ్చట తీర్చుకోవడానికి ఆడపిల్లలు లేరు. పక్కింటి అమ్మాయిల్ని పండుగలకు, పబ్బాలకు పిలిచి లంగాలు, గౌనులు క్రొత్తవి కుట్టించి యిచ్చి మిఠాయిలు పెట్టి తృప్తి పడేది. కానీ మనసులో కోరిక నాట్యం నటరాజ పూజ - ఆ కాలంలో ఆడపిల్లలకు - ఎవరి బిడడ్డలకు ఎవరు నేర్పుతారు నాట్యం -

నేను కొంత పెరిగాను. నాకు చెప్పించాలని సంకల్పించి మెదలు పెట్టింది. కానీ ఒక్కటే ఆమెకు నచ్చని విషయం -

గురువు గారు చెప్పే నాట్యం పురుషుడు శివుడు చేసేటట్టు వుండాలి. స్త్రీ పార్వతమ్మలా గాదు. అని తన కొడుకు పురుషుడుగా నాట్యం చేస్తే చూడాలని వున్నట్లు తెలిపింది.

గురువుగారు సందేహంతో చూస్తుంటే అయ్యా! మీరు సందేహించనక్కర్లేదు. మా వాడు పెరిగితే - ఒక పార్వతిని తెచ్చి అర్థాంగిని చేస్తాను. అప్పుడు యిద్దరూ శివపార్వతుల్లా నాట్యం చేస్తే సంతోషంగా మా వారూ, నేను చూస్తాము.

మా చిన్నతనంలో యిలాగ నేర్చుకోలేక పోయినా చిరకాలం కోరిక తీరుతుంది అన్నారట. నీ నాట్య అభ్యాసానికి పూర్వ కథ యింతుందని నాకు శివరాత్రి నాటి వరకు తెలియనే తెలియదు.

నా చిన్న తనంలో ఒకనాటి ముచ్చట - గాలిలో తేలిపోతున్నట్లు అడుగులు వేస్తూ నడవడం, చేతులు అలల్లాడ కదిలించడం, నడుము అలల్లాడించడం, తల అదోలా త్రిప్పి బెదురు చూపులు చూడటం, గొంతు సన్నగా చేసుకుని వయ్యారంగా మాట్లాడటం ఇవన్నీ నర్తకులకు ప్రత్యేకంగా వుండవలసినవి. యోమో - అని నాలో నేను - కొందరిని జూచి ఇమిటేట్ చేయడం. అభాస్యం చేస్తుంటే - ఒక రోజు మా అమ్మ వంట గదిలో ఫలహారం చేస్తూ ఎర్రగా కాలిన గరిటతో వచ్చి - కల్యాణ్ కపర్ది చుర్రున చురుక అంటించుతాను. అలాంటి వేషాలు వేశావంటే - అని అద్దం ముందు నిలుచున్న నా

దగ్గరకు అట్లకఱ్ఱతో మహిషాసుర మర్దిని మహాకాళిలా వస్తూవుంది. అంతలో మా నాన్న వచ్చారు. ఆయన రాకుంటే నా వళ్లంతా చురకలతో నిండేదేమో?

ఆయన మా యిద్దరికీ మధ్య నిలబడ్డాడు.

**అమ్మా :** చూచారా వాడి వేషాలు?

**నాన్న:** నిన్నెవరు వాడికి చెప్పించమన్నారు. మన యింటా, వంటా లేని దొమ్మరి విద్యలు

**అమ్మా:** అదేమిటండి అపచారం పరమశివుడు నాట్యం చేయలేదూ? అది దొమ్మరి ఆటా. అవును గాని దొమ్మరి వాళ్లను అంత తక్కువగా తీసిపారేయకండి దొమ్మరి అమ్మాయి గెడ యెక్కుతుంది గాని దొమ్మరి అబ్బాయి గాదుగా - ఎవరి పని వారు చేస్తే ముద్దుగా వుంటుంది.

**నాన్న:** కల్పవల్లి కామాక్షమ్మ నీతో నేను తర్కించలేను - ఇది నీ తప్పుగాదు చిన్నప్పటి నుండి శాస్త్రాలు చదివించిన పెద్దలది.

**అమ్మా:** మధ్య వాళ్లేమి చేశారు శాస్త్రము-శాస్త్రమే; ధర్మం-ధర్మమే; ఈ లోగా అమ్మ చేతిలోని గరిట చల్లారి పోయింది. పొయ్మి మీద బూరెలు వేగిపోతున్నాయి. అమ్మ వంట గదిలోకి వెళ్లిపోయింది. - అంతటితో ఆ చర్చ ముగిసింది.

కానీ నేను నేర్చుకున్న మరవరాని పాఠం, ఎవరు ఏ పని చేస్తే, ముచ్చటగా వుంటుందో ఆ పద్ధతిని అనుసరించి విధ్యనభ్యసించాలి అని.



# శివతత్వం - విష్ణుతత్వం

అభిషేక ప్రియుడు - శివయ్య, భోలా శంకరుడు

అలంకార ప్రియుడు - విష్ణువు

అత్తరువు, పునుగు, జవ్వాది, కస్తూరి, చందనము, అగరు, ఇవన్నీ ఇతనిక్కావాలి. పూచిన సన్నజాజి, ఘుమఘుమలాడే పూలదండలు మెడలో వేసుకుని జల్తారు, పట్టు పంచెకట్టుకుని, మెడలో రత్నాల హారాలు, నడమునకు నవరత్నాల వడ్డానము, చేతులకు సింహ తలాటాలు, వ్రేళ్లకు ఉంగరాలు - రత్నాలు దాపిన కిరీటం, ఒకటేమిటి - సంబ్రాణి పొగలు, కర్పూర హారతులతో దర్శనమిస్తాడు.

పులిహోర, చక్కెర పొంగలి, దద్ధోజనం, చిట్టిగారెలు యివన్నీ నైవేధ్యం కావాలి ఈ అయ్యకు.

ఇక శివయ్య - బిందెడు చన్నీళ్లతో స్నానం చేయించి, వంటికి విభూది రాసి, బొట్టుపెట్టి రెండు మందార పూవులు, నాగమల్లెలో, బిల్వపత్రి తలమీదుంచితే చాలు తృప్తి పడతారు.

-పై అన్ని రకాల ఫలహారాలు ఆయనకు అక్కరలేదు.

**నేను:** ఈ మధ్య లడ్డూ, ప్రసాదం పంచిపెడతున్నారు గదా!

**అమ్మా:** అవునట్టు - ఈ లడ్డూలెక్కడి నుండి వచ్చాయిరా అమ్మవారికి లడ్డూలే, అయ్యావారికి లడ్డూలే.

మా చిన్నతనంలో ఒక్కొక్క దేవతకు ఒక్కొక్క రకమైన ప్రసాదం పెట్టేవారు. మా యింటి దేవతకు నూకాలమ్మ తల్లికి పప్పూ - బియ్యం పులగం వండి - వెన్నె గాచిన నేయి, ఆ పులగం మధ్యలో దొన్నెలా చేసి - బెల్లం ముక్క నైవేద్యం ముఖ్యంగా పెట్టేవారు. గుగ్గిలం పొగవేసేవారు.

నేను: ఈ నైవేధ్యాలు ఇక వదిలేసి అసలు కథలోకి వస్తావా! అమ్మా

అమ్మా: అసలు కథ ఇక్కడే మొదలవుతుంది. అమ్మవారి పూజలో గుగ్గిలం పొగ ఎందుకు వేస్తారు. విష్ణు గుడిలో సాంబ్రాణి ఎందుకు వేస్తారు. నేతితో దీపం ఎందుకు పెడతారు? ఆముదం దీపం ఎందుకు పెట్టరు? అఖండ దీపారాధన ఎందుకు ముఖ్యం? ఇవన్నీ మనం ఎప్పుడైన ఆలోచిస్తామా?

నేను: ఇవి ఏమంత ముఖ్యము? ఏదో సంప్రదాయం.

అమ్మా: ఒరే బాబూ - రోడ్డు మీద ఆ డప్పులు విన్నావా? శివ భక్తులు పచ్చని బట్టలు కట్టుకొని శివాలయంలోనికి ఆడుతూ, తలమీద ఘటాలతో వెళ్లుతున్నారు. వారి నాట్యాల్లో డప్పులే ఎందుకు వాయిస్తారు. డోల్లు, సన్నాయి ఎందుకు వాయించరు?

పూర్వం ఆలయ పూజల్లో తంబళ్లవారు ప్రత్యేక వాయిధ్యాలు వాయించే వారు. ప్రస్తుతం ఇతర బాజాలు వున్నాయనుకో! మరి ఎందుకో ఆ బాజాలే వాయింపజేసేవారు - కారణాలేమిటి?

నేను: తల్లీ..! సన్నాయి వాయిధ్యం తప్ప నేను తంబళ్ల వారు అనే పేరు వినలేదు. నీ రీసెర్చితో చంపకు.

అమ్మా: అది గాదురా! శివతాండవం చేయాలి నీవు. శివతత్వం గూర్చి, వాయిధ్యాల గూర్చి తెల్సుకోవాలి, తెలియలేదనుకో, (లేకుంటే) కామాక్షమ్మ కొడుకు అంటే అందరూ నవ్విపోతారు.

ఇంకా ఏమో చెప్పబోతుంది అమ్మా

అంతలో మా నాన్న గారూ "తల్లీ - కల్పవల్లీ.. ఇక ఆపుతావా? గంట నుండి వింటున్నాను. వాడి బుర్ర తినేస్తున్నావు. వాడి ఓపికకు మెచ్చుకోవాలి."

అమ్మా: ఓపిక లేకుంటే విద్య ఎలా వస్తుందండీ - అందులో శివతాండవము పూర్వం - శివసాక్షాత్కారానికి ఋషులు ఎంతటి ఘోర తపస్సు చేసేవారు.... ....

అంతలో మా యింటి ముందు కారు ఆగింది.

అందులో నుండి మా అమ్మమ్మ దిగారు. ఆమె అమరావతిలో శివయోగినుల ఆశ్రమంలో వుంటున్నారు. షష్టిపూజ తరువాత తాతయ్య గారు కాశీకి వెళ్లి ఆశ్రమంలో వుంటున్నప్పటి నుండి...

ఆ చర్చ అంతటితో ముగిసింది.



# శివాలయం - శివ ప్రతిష్ఠ

ఆ సాయంత్రం చల్లగాలిలో మల్లె పందిరి క్రింద కూర్చొని మాట్లాడుకుంటున్నాము.

వచ్చే ఏకాదశి రోజున మా అమ్మమ్మ గారి ఊరి పక్క వూరిలో ఒక శివభక్తుడు కట్టించిన శివాలయంలో - శివ ప్రతిష్ఠ జరుగుతుంది. ధర్మకర్త గారు మా అమ్మగార్ని మమ్మల్ని తీసుకురమ్మని పంపినారు. ఆ విషయంగా ఆమె వచ్చారు.

"చిట్టీ! శివతాండవము. ఎంత వరకు వచ్చింది". నీ తాండవము, మా వూరిలో జరిగే ఉత్సవాల్లో చేస్తావా?

**నేను:** సప్త తాండవాల్లో - ఇంకా "సంధ్యాతాండవం" దగ్గరే వున్నాను. ఈ మధ్య కాలేజీ - కంప్యూటరు తీరికి లేకుండా వుంది బామ్మా.

**అమ్మా:** నా పట్టుదలే - మా వారికి ఇవన్నీ ఎందుకురా హాయిగా కంప్యూటర్ నేర్చుకుని అమెరికా వెళ్ళి ఒక సంవత్సరము ఉండి వస్తే చాలు అంటారు.

**అమ్మమ్మ:** అబ్బాయి గారూ! - నాకు తెలిసే అడుతున్నా ననుకొండి - జీవితంలో డబ్బే ముఖ్యమా కీర్తి ప్రతిష్ఠలా?

అమ్మమ్మ ఏదో శాస్త్ర చర్చ మొదలు పెడుతుందని గుర్తించి మా నాన్న గారు అక్కడ నుండి మెల్లిగా జారుకున్నారు.

**అమ్మ:** కంప్యూటర్ నేర్చుకుని వెళ్లితే ఒక చేత్తో సంపాదించుకోవచ్చును. నాట్యం గూడా నేర్చుకుని వెళితే తెలివితేటలుంటే నాలుగు చేతులతో సంపాదించుకోవచ్చును.

ఇక వారి చర్చలు ఆంధ్రలో శివుడు, శివాలయాల మీద జరిగింది.

మన ఆంధ్రదేశం ఒక విచిత్ర దేశమే అమ్మాయి -

శివుడికి ఎంత ప్రాముఖ్యత - ఎంత ప్రాముఖ్యత యిచ్చారంటావు మనవారు.

కాళేశ్వరం, శ్రీశైలం, దాక్షారామం ఈ మూడు ప్రాచీన దేవాలయాల మధ్య

ఉండే దేశం త్రిలంగదేశమన్నారు. మనం తెనుగువారమయ్యాము. మరెక్కడా లేని ఐదు ఆరామాలు పంచారామాలు శివాలయాలు. ద్రాక్షారామం, అమరావతి, సామర్లకోట, గునిపూడిభీమవరం, పాలకొల్లు మన దేశంలో వున్నాయి. కొప్పేశ్వరుడు, కుక్కుటేశ్వరుడు, చంటీశ్వరుడు, తురంగేశ్వేరుడు, క్షణముక్తేశ్వరుడు, మురమళ్ల నిత్య కల్యాణ వీరేశ్వరుడు ఇలా ఎన్ని రూపాలలో శివుడు మన దేశంలో వెలిశాడు.

ఇలాగ చెప్పుకుపోతే తెల్లవారి పోతుంది. గాని శివాలయంలో ప్రతిష్ట రోజున మన కల్యాణ్ కపర్దిని తప్పక తీసుకురావాలి. అక్కడ శైవ సంప్రదాయం బలిహరణ, తంబళ్ల వాయిద్యం తప్పక ఉంటుంది.

**అమ్మ:** అమ్మా ఒక సందేహం. ఈ మధ్య పెనుకొండ (పశ్చిమ గోదావరి జిల్లా) కన్యకాపరమేశ్వరి దర్శనం కోసం వెళ్లా - అక్కడ "లింగాల వీధి" అని ఒక వీధి ఉంది, అక్కడ ఎన్ని శివ లింగాలు పడి వున్నాయనుకున్నావు. రోడ్డు మధ్య, రోడ్డు ప్రక్క, ఇండ్ల ముందు వరండాలల్లో ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ ఆలన పాలన లేక-

**అమ్మమ్మ:** అదే శిలాభోగం అనేవారు పెద్దలు. శిలలనుదొలిచి - యంత్రం వేసి - ప్రతిష్టించినప్పుడు - ఆ శక్తి వున్నంత కాలం - ఆ శిలలు పూజింపబడ్డాయి. అందులో శక్తి తగ్గగానే సామాన్య రాళ్లు అయ్యాయి.

మానవ జీవితం గూడా అంతే అమ్మాయి..

అంతలో కారు వచ్చి ఇంటి ముందు ఆగింది. అమ్మమ్మ తయారయ్యి వెళ్లి పోయారు.

ప్రతిష్టకు ఒకరోజు ముందే అమ్మా, నాన్న, నేను అమరావతి చేరుకున్నాము. ప్రతిష్ట రోజు ఉదయమే లేచి కృష్ణలో స్నానం చేసి అమరలింగేశ్వరుని దర్శనం చేశాము. శివ లింగము ఎంతో పొడుగ్గా వుంది. రోజు రోజుకు ఆ శివ స్వరూపము పెరిగిపోతూవుంటే తలపై మేకులు కొట్టారు ఆనాటి నుండి పెరుగలేదు - అంటారు.

అక్కడ పూజలు ముగించుకొని, బౌద్ధ స్థూపాల మ్యూజియం చేరుకున్నాము. మన ప్రాచీన శిల్పులు ఎంతటి సజీవ శిల్పాలు పాలరాతిలో చెక్కారు. ఎన్నో వందల సం॥ల

క్రితం చెక్కినమూ, ఎన్నో రాజకీయ, మత విధ్వంసాలకు గురియైననూ ఆ శిల్పాలు నేటికీ జీవకళతో శోభిల్లుతున్నాయి. అక్కడ నుండి క్రొత్తగా నిర్మింపబడిన గుడికి వెళ్లాము. ఆ ఆలయం నిర్మించిన వారు శైవులు. కుటుంబమంతా పరమ శివ భక్తులు, శివనామోచ్చరణ చేయుట, ఖడ్గాలు చదువుట తప్పవేరే ధ్యాస వారికి లేదు. చాలా నిష్ఠాపరులుగా వారిని గ్రహించాను.

గుడిలో రెండు రకముల పూజారులున్నారు. పూర్తిగా శిభక్తులు లింగధారులు కొందరు. వైధిక పూజా విధానం తెలిసిన వారు కొందరు. గుడికి ఒక ప్రక్కగా హోమగుండము, హోమము జరుగుతుంది. విగ్రహాలు ఊరేగింపుతో తెచ్చారు. ముందుగా విఘ్నేశ్వర ప్రతిష్ట మా నాన్నగారితో చేయించారు. పంతులు గారు ప్రతిష్ట జరిగే సమయంలో మా నాన్న గారిని ఆహ్వానించి, ఆయన చేతిని దోసిలిగా పట్టమని దానిలో పాదరసం పోశారు. విఘ్నేశ్వర ప్రతిష్ఠ జరిగే చోట ఆపాదరసము పోయించారు. యంత్రము దానిపైనుంచి, విగ్రహం ప్రతిష్టించారు. అటుపై పరమశివుని ప్రతిష్ఠ శ్రీశైలం బసవపీఠం నుండి వచ్చిన ఒక స్వాముల వారు జేశారు. అప్పుడు వాయిధ్యాలు మోగించారు. 'శివ శవ శంభో...' అని శివనామం భక్తులందరూ గానం చేశారు. యీ తీరున మిగిలిన దేవాలయాల్లో గూడా విగ్రహ ప్రతిష్టలు జరిపినారు.

ఆటుపై ప్రారంభమయింది 'బలిహరణ' అష్టదిక్పాలకు ఆరాధన - అలాంటి పూజా విధానము ఆ వాయిధ్యం 'తంబళ్ల వాద్యం' ఆ ఖడ్గాల పటన అదంతా నాకు క్రొత్త.

ఒక పక్క వేద మంత్రోచ్ఛారణతో శాంతంగా హోమం జరుగుతూ వుంది. మరొక దిక్కుగా శైవ సంప్రదాయం వీరరస ప్రాధాన్యత గల్గిన బలిహరణ.

తూరుపు దిక్కుగా నిలబడి శివభ క్తుడు ఖడ్గ స్తోత్రాలు గంభీరంగా చదివాడు. చేతిలో కత్తి పట్టుకుని, వెంటనే తంబళ్ల వాయిద్యం మ్రోగగా అతడు వీరావేశముతో ఒక బూడిద గుమ్మడి కాయను కత్తితో రెండు ముక్కలుగా నరికి వేశాడు. వాయిధ్యాలు ఉధృతంగా పలికినవి. కొద్దిగా వీరనాట్యం చేశాడు.

ఇలా ఎనిమిది దిక్కులా తిరుగుతూ ఖడ్గాలు చదువుతూ బూడిద గుమ్మడి కాయలు చీల్చి బలి సమర్పించాడు. అష్ట దిక్పాలురకు పూర్వం జంతు బలులు వుండేవేమో.

కానీ ప్రస్తుతం గుమ్మడికాయ సమర్పణతో ముగించబడుతోంది. ఇది శైవ పద్ధతి బలిహరణ. వైష్ణ దేవాలయాల్లో మరొక పద్ధతిగా వుంటుంది. ఆ బలి సమర్పించే పద్ధతి. అతడు వయస్సు దాటి వృద్ధాప్యంలోకి వస్తున్నాడు మరి వయస్సులో ఎంత ఉధృతంగా వుండేదో ఆ పూజా విధానము, వీర నాట్యం.

అటుపై హోమము - యధా విధిగా జరిపించారు. అంతవరకు పరమశివుని స్వరూపం ప్రత్యక్షంగా చూడక ఒక అద్దములో జూచాము.

హోమము గూడా ముగించిన పిదప స్వామిని ప్రత్యక్షంగా చూసే అవకాశం లభించింది.

ఈ 'బలిహరణ' విధానం అరుదు. సాధారణంగా శివాలయాల్లో ఈ విధమైన పద్ధతి వుండదు.

ఇది ప్రత్యేక వీరశైవ విధానమై వుండవచ్చును.

ఈ బలిహరణ దృశ్యం జూచినప్పుడు నా చిన్న తనంలో మహంకాళమ్మ జాతరలప్పుడు 'డొక్కలమ్మ' గుడి దగ్గర జరిగే "గావు" దృశ్యం జ్ఞాపకం వచ్చింది.

ఏండ్లు గడిచిపోయినా ఆ దృశ్యం తలుచుకుంటే నేటికి నా వళ్లు జలదరిస్తుంది.

అంత భయం దోచింది ఆ దృశ్యం.

ఆ 'గావు' చూడ్డానికి మా నాన్నగారు నన్ను తీసుకుని వెళ్లారు. అమ్మవారి గుడి చిన్నదే - విగ్రహం చిన్నదే.

కానీ ఆ రోజు, ఆ సమయం ఆ ఆలయం చూడాలి. అఖండదీపం వెలుగులో ఆ దేవిని చూస్తే భయంతోచింది. ఆ ఆలయం అలంకరణ ఎంతో క్రొత్తగా తోచింది.

కొద్ది దూరంలో డప్పులవారు, "అమ్మవారి జాతర - సంబరం బాణీ" వాయిస్తున్నారు. గుగ్గిలం పొగ ఆ ప్రదేశం అంతా కమ్మి వేసింది. గుడి తలుపులకు రెండు ప్రక్కలగా బారులు తీరిన జనం నిలబడ్డారు.

పోతరాజు-బలిష్టంగా భీముని లాంటి కండలు తిరిగిన వ్యక్తి. నల్లని శరీరం, గిరిజాల

జుత్తు, తెల్లని కోరల దంతాలు, బూర మీసాలు, కాళ్లకు గజ్జెలు, వంటి నిండా పసుపు కుంకుమ రుద్దుకొని, బంతిపువ్వులు, చేమంతి పూల దండలు మెడలో వేసుకొని, ఎర్రని లంగోటీ మాత్రం ధరించి వస్తున్నాడు. ఆర్భాటం.. ఏమి ఆర్భాటం.... కేకలు పెట్టేవారు, పొలికేకలు పెట్టేవారు. గుగ్గిలం పొగలు వేసేవారు. పేకబెత్తాలు చేతుల్తో పట్టుకొని, గాలిలో పెళపెళలాడిస్తూ నొసటనంతను కుంకుమ బొట్టు పెట్టుకొన్నవారు వచ్చేస్తున్నారు. వచ్చేస్తున్నారు.. వచ్చేస్తున్నారు... వచ్చేశారు.

డప్పులు మ్రోగుతున్నాయి... మ్రోగిపోతున్నాయి... చెవులు గింగురలెత్తుతున్నాయి. ఆ దృశ్యం జూచి నేను హడలి పోయి కండ్లు మూసుకొని, మా నాన్నను గట్టిగా పట్టుకున్నాను.

కపర్దీ..! కండ్లు తెరువు భయపడకు "పోతరాజు 'గావు' పడతారు అంతే" అన్నారు నాన్న.

ఇంతలో పెళపెళ - పెళపెళ మని పేక బెత్తాల చప్పుళ్లు గాలిలో వినబడ్డాయి.

జై అమ్మ దొక్కాలమ్మా, తల్లీ దొక్కాలమ్మా, అమ్మతల్లీ దొక్కాలమ్మా అనే అరుపులు కేకలు.

అతనికి ముందు అమ్మ వారి గడప దగ్గర ఇద్దరు ఒక మేక పిల్లకు స్నానం చేయించి పసుపురాసి, బొట్టు పెట్టి, మెడలో పూలదండ వేసి గుగ్గిలం పొగ దాని ముక్కు దగ్గర ఉంచారు. 'జడత' పట్టారు. ఊపిరాడక అది కొట్టుమిట్టాడుతుంది. ఇద్దరిలో ఒకరు ఆ మేక పిల్లను పైకి ఎత్తి పట్టుకున్నారు.

గుడిలో అమ్మవారికెదురుగా కొద్ది దూరంలో వున్న పోతరాజు - డప్పుల చప్పుడుకు ఊగిపోతున్నాడు తనలో తను ఏమటో అనుకుంటున్నాడు. ఒక్క అరుపులో ఉన్న చోట నుండి - ఎగురుతూ, దుముకుతూ, పరుగెత్తుకొని వస్తున్నాడు. ఆ మేకపిల్ల దగ్గరికి -

ఈ బెత్తాలు పట్టుకున్న వారు తమ యిష్టం వచ్చినట్లు - బెత్తాలతో అతన్ని చితక బాదుతున్నారు. అతను మరల తిరిగి వెనకకు వచ్చేవాడు. యిలాగ కొంత తడవయిన తరువాత తన శక్తినంతా వుపయోగించి - ఎగిరి గంతేసి ఆ మేకపిల్ల గొంతును పట్టుకున్న వారి నుండి కొరికి నోటిలో పట్టుకొని వేడి రక్తం ఆ స్థలమంతా చిమ్ముతుండగా ఉధృతంగా

ఆడడం మొదలుపెట్టాడు. అక్కడ అందరూ ఆనందంతో ఎగరుతూ, దూకుతూ కేరింతలు కొడుతున్నారు.

రెండు రక్తపు చుక్కలు నాపై గూడా పడినవి. నేను కెవ్వున కేక వేసి నాన్న గొంతు పట్టుకున్నాను. కళ్లు మూసుకున్నాను.

అలాగ ఎంత సమయమున్నానో. మా యిల్లు చేరాము. నాన్న నన్ను నిద్ర లేపారు.

"చాలు లెండి మీ సంబరాలు మీరూనూ చిన్న పిల్లవాడు వాడు జడుసుకున్నాడో ఏమో" అని అమ్మ నాన్నతో దెబ్బలాడుతూ పసుపు నీళ్లతో నా ముఖం కడిగింది. అయితే యీ దృశ్యం నాకు శివతాండవంలో భయానక, భీభత్స, రౌద్ర, దృశ్యాలు నర్తించేటప్పుడు ఎంతగానో ఉపయోగపడ్డాయి. కండ్లు మూసుకొని తెరిచే అంతలో ఈ దృశ్యాలు తలుచుకుంటే, వొల్లు పులకరించి గగుర్పొటుస్తుంది.

ఈ దృశ్యం గురించి పూర్తిగా రాయడానికి ప్రయత్నించాను. చిన్నతనంలో భాష సరిపోయేది గాదు. నా చేతిలోని కలం వణికి పోయేది.

ఇందరికి ఆనందం చేకూర్చిన ఆ పసి మేక పిల్ల ప్రాణం ఎంత తల్లఢిల్లిందో అని ఒక్కొక్క పర్యాయం ఆలోచిస్తుంటే నా కండ్లు నీరు నిండేవి.

పెద్దవాణ్ణయ్యాక ఇప్పుడు ఆలోచిస్తుంటే జీవితం యింతే నేమో? "ఒకరి దు:ఖాలు - ఇతరులకు ఆనందం చేకూరుస్తుంటాయి కొన్ని సమయాల్లో అని తోస్తుంది.

హృదయం బరువెక్కుతుంది".



# మరొక శివరాత్రి

శివరాత్రి నాడు శివుని సేవించుటకు ఎక్కడెక్కడినుండో శివభక్తులు వచ్చారు. శైవులు, పశుపతులు, వీరశైవులు, ఇలా ఎందరో వచ్చారు. వారి శివనామ ఘోష మిన్నుముట్టుతోంది. వీరు గాక చెంచుల కోన నుండి చెంచులు, భిల్లులు అనేక తెగల వారు వచ్చారు. శ్రీశైల శివాలయం ఈ భక్తుల శివనామ స్మరణతో నింగినంటుతోంది.

శైవులు లింగధారులు పూజలు జరుపుతున్నారు. ఆలయంలో ఒకపక్క బ్రాహ్మణ ఆరాధ్య అయ్యవారు వేద పఠన జేస్తున్నారు. ఆ పూజా విధానాలు జూచాను. రెండు పద్ధతుల శివార్చన గూర్చి తెలుసుకున్నాను. వీర ముష్టివారి వీర నాట్యం జూచాను. వీరుల వీర కోలల సేవ జూచాను. వీరరసం చిప్పిల్ల జేసే వాయిద్యాలు డప్పులు, తాసామేళాలను తిలకించాను. అగ్ని గుండాలు తొక్కడం జూచాను. వీరుల త్యాగాలు శిల్పాలలో మాత్రం వీరశిలలుగా జూచాను. ఖడ్గాలు చదువతూ - త్రిశూలాలు త్రిప్పుతూ వీరావేశముతో ఆడే ఆటలు యినాడు జూచాను.

ఇవన్నీ ఒక ఎత్తు అమ్మ చెప్పిస్తున్న శివతాండవం ఒక యెత్తు. ఆనాడు అక్కడ సర్వం శివమయంగా తోచింది.

**అమ్మ:** బాబూ కల్యాణ్ - మల్లయ్య తల మీద నీ తలపెట్టి మొక్కుకో - నీవు ఆ తండ్రి అంతటి గొప్ప కళాకారుడవు అవాలని ఆ తండ్రి దయవుంటే క్షణంలో నిన్ను జేసేస్తాడు. ఆయన అంతటివాడుగా.

అమ్మ కోర్కె ప్రకారం ఆ దేవుని శిరసుపై - శిరసు నుంచాను. అదొక దివ్యానుభూతి ఈ లోకాన్ని మరిచి నన్ను మరిచి - ఒక్క నిమిషం అలాగే నిర్మలమైన మనస్సుతో వుండిపోయాను. నా ఆత్మ ఎక్కడో దివ్య లోకాలు సందర్శించిన అనుభూతి కల్గింది. మరునాడు తిరిగి వచ్చాము.

ఆ రోజు నుండి - నాలో - అంటే - నా మనస్సులో ఏదో మార్పు తోచింది.

ప్రతి రోజు మా అమ్మ బోధననుసరించి క్రమము తప్పక సాధన చేస్తున్నాను. గురువు గారు గూడా ఎన్నో విధాలుగా శ్రమించి సహకరించి విధ్యనభ్యసింపజేస్తున్నారు.

కానీ, అప్పుడప్పుడు నాకొక సందేహం కల్గుతూవుండేది.

అమ్మ శివసాక్షాత్కారమంటుంది. ఎప్పుడూ, నేను నటరాజమూర్తి అరాధకుణ్ణి అవుతున్నానా? లేక ప్రాచీన యోగులు, ఋషులుగా రూపొందుతున్నానా? ఒక గొప్ప నర్తకుణ్ణి అయ్యి శివతత్వం ప్రపంచానికి ప్రభోధం చేయాలనే నా ఆశయం.

నాకు శివతాండవ శిక్షణ పూర్తిగా వచ్చింది.

నా కోరిక తీర్చడానికి - అమ్మ 'రంగపూజ' గొప్పగా చేయించుతానన్నారు. కాశీ నుండి ఆరోజు మా తాతగారు కూడా లేఖ రాశారు. శివ స్వరూపాన్ని పూర్తిగా అవగాహన చేసికోగల్గుతున్నాను. తాండవము-శుద్ధ తాండవ రూపాలను, కాని అంబలాస్య మెలాగుంటందో నాకు అసలు ఊహకయినా తెలియలేదు. ఆ విషయం మా అమ్మకు చెప్పాను.

"అది నేను గ్రహించాను కపర్దీ

లాస్యం అభినయించ గలిగే ఒక విద్వాంసురాలు గురించి వెదుకుతున్నాను. కోనసీమలో ఒక వృద్ధ పండితురాలు వుందట. అక్కడ వేద పండితులంతా ఆమె విద్యకు మెచ్చి 'శర్మ' అనో 'శాస్త్రి' అనో బిరుదుతో గౌరవించారట. ఒకసారి వెళ్ళి చూచి వస్తాను" అన్నారు అమ్మ.

అమ్మ ఒక వారం రోజులు కోనసీమంతా గాలించి ఆఖరికి ఒక మారుమూల పల్లెలో ఒక వృద్ధ కళామూర్తిని కనుగొని వచ్చారు. వచ్చీ రావడంతో -

"అబ్బాయి కల్యాణ్ - కార్యదీక్ష పట్టుదల వుంటే ఇసుకలోనుండైనా తైలం పిండవచ్చునని మా అమ్మమ్మ అనేవారు - సాధించుకొని వచ్చాను. నీ విద్యకు సంపూర్ణత్వం చేకూర్చుతున్నాడు ఆ నటరాజు స్వామి" అన్నారు.

ఒక వారం తరువాత ఆ వూరు వెళ్లాము.

కోనసీమ కొబ్బరితోటలు, మధ్యలో పూచిన చేమంతులు, ప్రశాంత వాతావరణము, అక్కడ వుంటే లోకమే మరిచి పోతాము. ఊరికి ఒక పక్కగా కొబ్బరి తోట మధ్యలో పర్ణశాల లాంటి ఒక యిల్లు, ఒక ప్రక్కగా ఆవు దూడ కట్టేసి వుంది. చిన్న మల్లె పందిరి పక్కనే మంచినీళ్ల బావి. మేమువచ్చామని తెలిసి యింటివారు లోపలికి ఆహ్వానించారు. ఐదు నిమిషాలు వరండాలో నిశబ్ధంగా కూర్చున్నాము. ప్రక్కనున్న గదిలో నుండి అగరవత్తుల సువాసన. ఒక స్త్రీ గాత్రం సన్నగా రాగం ఆలాపిస్తుంది. మధ్యలో ఆపింది.

ఓహో! మీరా! శంకరాభరణం గదా! చాలా కాలానికి అన్ని స్వరాలు శుద్ధంగా పలికేనా? ఎక్కడైనా అపస్వరం - ఎవరో మాట్లాడుతున్నట్లు వినిపిస్తున్నాయి ఆ మాటలు. వారి యింటి అమ్మాయి మా పక్కనే కూర్చొని వుంది. "అమ్మమ్మ గారేనండీ, ఎప్పుడు సంగీతం ధ్యాసయే ఏవేవో స్వరాలు పాడుతూ ఆ రాగాలు తన ముందు ప్రత్యక్షమయినట్లు వాటితో సంభాషించుకుంటూ వుంటారు.. తమరు దయచేశారని వినికిడి చేశాను" అని చెప్పుతుండగానే...

"అమ్మాయి తలుపు తియ్యి కళాకారులు వచ్చారా?" అని లోపలినుండి మాట వినిపించింది. తలుపులు తీశారు. మేము లోపలికి వెళ్లాము. ఒక్క క్షణకాలం ఆమె పూజ మందిరం చూస్తూ నిలబడి పోయాం. నాన్న మరీ ఎక్కువగా ఆశ్చర్యపోయారు.

కూర్చోండి బాబులు - ప్రొద్దునే ఏమైనా పుచ్చుకున్నారా? అమ్మాయి మూడు గ్లాసులు ఆవుపాలు పట్రా అన్నారు. నేను తీసుకుని వెళ్లిన నూతన వస్త్రాలు పండ్లు ఆమెకు సమర్పించబోయాను.

అలా నేను స్వీకరించను 'అబ్బాయీ పక్కన పెట్టు - నాలో ఏమి గొప్ప జూచావని ఈ సన్మానం - సత్కారం.

ఒక్క నిమిషం నిశబ్ధం. ఎక్కడో ఆలోచిస్తున్నదామె.

అబ్బాయీ - నీకు 'కురంజి' రాగం గురువు గారు శిక్షణ యిచ్చారా?

'కొద్దిగా వచ్చుమా' - అని కొంత ఆలాపించాను.

'చాలు బాబు - ఇంకా ధీమా కావాలి - ఈ కాలం సంగీతాలు యింతే'-

'నాదు బిందు కళాతినమో నమో

వేద మంత్ర స్వరూప నమో నమో" అని తనలో తనే పాడుకొని-

మా కాలంలో మైకులు లేవు. ఆ సాధన వేరు. నీవు లాస్యం చూడాలా - తాండవము నేర్చుకున్నావా? - శివపరంగా వుండాలా - అంటూనే

"శివదీక్షా పరురాలనురా నే"

పాడడం మొదలు పెట్టారు. డెబ్బది ఏండ్ల పండు ముసలి పదహారేండ్ల జవ్వని అయింది. ఆమె కనుల్లో అపూర్వ తేజం మెరిసింది. ఆమె తనువు దివ్య తేజంతో నిండి నట్లనిపించింది. ఆ యిల్లు గాదు, ఆ పరిసరాలు గావు, ఆ ప్రాంతం గాదు, ఆ తీరం గాదు, ఎక్కడకో ఎక్కడెక్కడికో - వర్ణించలేని వర్ణించతరము గాని హిమాలయములకు తీసుకొని వెళ్లింది. తండ్రి హిమవంతుడు - తల్లి మేనక ముందు నిలిచి పరమశివుని గూర్చి తపన, వియోగం, భక్తిని వెల్లడి జేస్తుంది అంబ.

"తల్లిదండ్రులు ఆమె ఆరాధన భావమునర్థము చేసుకొని - సుందరేశునికి ఆమె నిచ్చి కల్యాణంగావించి అశ్రునయనాలతో అత్తగారింటికంపినారు.

అకస్మాత్తుగా ఆమె గొంతు ఆగిపోయింది.

కురంజి 'స్వరకన్యలు' వెళ్లిపోయారు. ఇక రారు - నిమిషమలాగే వుండి తిరిగి మనలోకంలోకి వచ్చారు.

అబ్బాయి - లాస్యం దర్శించావా? ఇప్పుడు ఏదీ నీ సత్కారము నా చేతుల మీదగా ఆ చిన్ని సత్కారాన్ని స్వీకరించి వస్త్రాలు మాత్రమే తీసుకొని కాసులు నాకు తిరిగి ఇచ్చివేశారు. "ఇవి నీకు ఉపయోగపడతాయి. జాగ్రత్తగా పెట్టుకోబాబు" - అంటూ.

x x x

మధ్యాహ్నం విశ్రాంతి తీసుకొని ఆ సాయంత్రం తిరిగి వచ్చేశాము. ఇంటికి రాగానే మా అమ్మ కాళ్లు కడుగుకొని పూజా మందిరంలో నేతి దీపం వెలిగించి

కల్యాణ్ - ఈ రోజుతో నీ విద్య సంపూర్ణమయింది.

నీ 'రంగపూజ' త్వరలో చేయిస్తాను.

మంత్ర ముగ్దునిలా నిలబడివున్న నాన్నని జూస్తూ - ఏమండోయ్ మాటాడకుండా వుంటే సరిపోదు అన్నీ మీరే చేయాలి 'రంగపూజ' తరువాత మీరు కపర్దీని అమెరికా పంపుతారో, లండన్ పంపుతారో ఆ భారం మీది - అన్నారు.



# భరత తత్వము

ఆంగికం, సాత్వికం, హస్తాభినయం, శాస్త్రము-శాస్త్ర వ్యాఖ్యానం - సంప్రదాయ వాఖ్యానం.

భరతముని ఇత్యాది శాస్త్రవేత్తలెందరో నాట్య శాస్త్రాలను రచించారు. నాట్యకళకు ఒక రూపాన్ని సృష్టించారు.

ఆనాటి దేశ భాషలో - ఆ భాష నెరిగిన పండితులు, విధ్వాంసులు విద్యావేత్తలు ఆ గ్రంథాలలోని సూత్రాలకు వ్యాఖ్యానాలు రచించి, విపులీకరించారు.

ఆ మూల గ్రంథాలను, వ్యాఖ్యానాలను అధ్యయనం చేసి, దేశ కాలపరిస్థితులకు అనుకూలంగా నాట్యాచార్యులు సంప్రదాయాలు నేర్పరిచి, శిష్యులచే అభ్యసింపజేసి ప్రదర్శనలిప్పించి ప్రచారం చేశారు, చేస్తున్నారు.

ఆ విధంగా మూల మొకటే అయినా అనేక సంప్రదాయములేర్పడినవి. ఒక్కొక్క సంప్రదాయంలో ఒక్కొక్క విశిష్టిత వుంటుంది. వివిధ సంప్రదాయాల గూర్చి అధ్యయనం చేసి - కళాకారుడు తన విద్యను తీర్చిదిద్దాలి. నాడు విద్య సంపూర్ణంగా వికాసం చెందుతుంది.

ఇది మా అమ్మ నమ్మకం.

అందువల్ల ఆమె అనేక నాట్య గ్రంథాలు, వ్యాఖ్యానాలు చదువడమే గాక, ఆయా నాట్యాచార్యుల, శాస్త్రవేత్తల సంప్రదాయాలు, అనుభవాలు, అనుభూతుల గూర్చి - తను సేకరించిన విషయాలన్నీ నాకు తెల్పుతూ వచ్చారు.

భారతదేశం సువిశాలమైనది. అనేక జాతుల వారు, అనేక భాషలు మాట్లాడుతూ దేశంలో వున్నారు. వీరినందరిని ఒక్కటి చేస్తుంది మన ఉత్తమ సంస్కృతి సంస్కారము. విషయమొక్కటే అయిననూ, వివిధ ప్రాంతీయులు, వివిధ పద్ధతుల్లో ప్రదర్శనలిస్తుంటారు.

ఎందుకలా చేయవలసి వచ్చింది. చేస్తుంటారు? ఇవన్నీ ముఖ్య సమస్యలు ఇవన్నీ తెలుసుకుంటే-

భారతీయత అనేకత్వంలో

ఏకత్వం సాధించినట్లేనని - అమ్మ అభిప్రాయం.

ప్రతి సంప్రదాయంలో, పద్ధతిలో ఏదో ప్రత్యేకత వుండుట వల్లనే అవి మన సంస్కృతిలో ఇంతకాలం జీవించగల్గినవి. అందువల్ల అన్నింటి యెడల సమభావము, గౌరవ భావము గల్గి ఆరాధించాలి అనే తలంపుతో నాకు అన్ని సంప్రదాయాల విలువలు తనకు వీలుజిక్కినప్పుడల్లా, తనకు తోచిన రీతిలో చెప్పుతూ వచ్చింది.

కేరళ శంకరనంబూద్రి - గొప్ప కథకళి నాట్యాచార్యులు వారి నర్తనరీతిలో నర్తకులు పాడరు. వంత పాడిన వారి పాటకు శరీరముతో వ్యాఖ్యానం చేస్తారు. నృత్యం ఎక్కువగా వుండదు. కనుక శరీరం యొక్క కదలికతో ఒక కథగమనము తెలుపుతారు. స్వయంగా పాడరు గనుక వీరు అనుభూతుల్ని తేల్పే విధం, మనకు తేడా వుంటుంది. రాధా-మాధవుల ప్రేమ తత్వాన్ని తమ కళలో ఆరాధించి తరించిన కలికాదిన్, బిందాదిన్ మహారాజుల వంశీయులు - అచ్చన్ లచ్చూ, శంభూమారాజులు - వీరి సంప్రదాయం తిలకించాలి మధుర ప్రేమ రసాన్ని ఆస్వాధించాలి.

పందనల్లూరు సుబ్బరాయనట్టువ నారు వారసులు - మీనాక్షి సుందరం పిళ్ళే గారు. వారి పేరులోనే వున్నారు మాతా మీనాక్షి, సుందరేశులు. వీరు సంప్రదాయానికి యెక్కువ విలువనిస్తారు. కూచిపూడి ఆచార్యులు వేదాంత లక్ష్మీనారాయణ శాస్త్రిగారు. భరతుడు ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్వికము అని నాల్గు భాగాలుగా చెప్పినా, వాచికాన్ని గూడా ఆరాధించిన వారు మనవారే కనిపిస్తున్నారు.

అందువల్ల మన ఆటలో భావ సౌందర్యం, భాషా సౌకుమార్యం వెల్లివిరుస్తూవుంటుంది.

ఈ విధంగా తనకు వీలైనప్పుడల్లా వివిధ ప్రాంతాల నాట్యరీతులు, ఆచార్యులు, ఆ ప్రదర్శన తీరులు భోదించారు.

ఎందుకు వారు అలా చేస్తారు?

ఆ పద్ధతులు ఎలా రూపొందాయి అని నేనొక పర్యాయం అడిగాను.

**అమ్మా:** బాబూ కల్యాణ్ నేను కొన్ని విషయాలు మాత్రం చెప్పాను. నీవు వృద్ధిలోకి వచ్చాక యింకా పరిశోధన చేయాలి. ప్రస్తుత కాలంలో మా సంప్రదాయం గొప్పది అంటే మాది గొప్పది - అని కొందరు తర్కములోనికి దిగి తూలనాడుకుంటున్నారు. అలాంటి సంకుచిత భావాలు నీలో కలుగకూడదు. అన్ని రీతులు మహత్తరమైనవే.

దేశ కాల పరిస్థితులను బట్టి, పోషించు ప్రభువుల అభిరుచులు బట్టి, ప్రాంతీయ కళలు ఆ తీరున రూపొందాయి. కనుక అన్నింటినీ గౌరవించాలి. అనే విశాల దృక్పథం నీలో ఏర్పడాలి. అని ఈ వివరాలు నీకు చెప్పుతున్నాను. దీని గూర్చి ఎన్ని పరిశోధనలు చేశాననుకున్నావు. ఎంతకాలం నుండి ఈ గ్రంథానంతా సేకరించాననుకున్నావు! అందుకే పట్టుబట్టలో చుట్టిపెట్టి మీ తాతగారి భోశానం పెట్టెలో పదిలంగా దాచాను.

**నేను:** అమ్మా! నాకొక చెల్లి గాని, అక్క గాని వుంటే ఎంత బాగుండేదో!

**అమ్మా:** కపర్దీ! కొడుకునైనా కూతురునైనా నీలో చూసుకొని తృప్తి పడుతుంటానురా! అందుకే నీకు అర్ధనారీశ్వర నాట్యం. శిక్షణ ముగింపులో తప్పక చెప్పించమని గురువు గార్ని కోరాను.



# శివ సాన్నిధ్యం - శివతాండవము

కోనసీమ నుండి వచ్చాక మా అమ్మ వుత్సాహంతో పరుగు లెత్తుతున్నా నాన్నా గారు చల్లగా ఉన్నారు. అమ్మ కాశీలో వున్న మా తాతయ్యా గారికి మళ్లీ లేఖ వ్రాశారు. కాశీలో డాక్టరు ప్రేమలత శర్మ అనే ఒక మహా గొప్ప సంగీత విధ్వాంసురాలు వున్నారట. ఆమె సంగీత సరస్వతి ఆరాధకురాలు బహుభాషా కోవిధురాలు, బ్రహ్మచారిణి. బెనారసు విశ్వవిద్యాలయంలో సంగీత శాఖకు పెద్దగా వున్నారు. రిటైరు అయ్యాక, అటుపై మధ్యప్రదేశ్ ఖైరాఘుర్ ఇందిరా సంగీత విశ్వవిద్యాలయం వైస్ చాన్సలరు చేసి విశ్రాంతి తీసుకొంటున్నారు. ఆమెను కలియమని తాతయ్యా సలహా యిచ్చారు. వెంటనే నన్ను తీసుకొని అమ్మ కాశీకి బయలు దేరారు. ప్రేమలత శర్మ గార్ని (ఆమెను అందరూ బహిన్‌జీ అంటారు) కలిశాము. నా నృత్యము గూర్చి అమ్మ చెప్పారు. ఆమె చాలా సంతోషించి - నాట్య శాస్త్రం అభినయ దర్పణం, జాయప నృత్తరత్నావళి, సంగీత రత్నాకరము యిలా ఎన్నో గ్రంథాల గూర్చి కొన్ని ప్రశ్నలడిగి తెలుసుకొని సంతసించారు. కొద్దిగా శివతాండవం ఆడి చూపించాను.

బెనారసు విశ్వవిద్యాలయంలో నా శివతాండవం ఏర్పాటు చేసిన్తున్నట్లు అభయమిచ్చారు. అమ్మ హృదయమెంతో పొంగిపోయింది. జలజల కళ్లు వర్షించాయి. "నా కన్నీరుతో మీ పాదాలు అభిషేకిస్తున్నా -సంగీత సరస్వతీ" అని ఆమె పాదాలపై తలమోపారు.

మా ఊరు తిరిగి వచ్చాము.

అమ్మ నా ఆహార్యం గురించి గ్రంథాలు భారతీయ శిల్పాలని తిరిగేశేవారు. ఉదయ శంకరు, రాంగోపాలు, నటరాజవశి, అశోక్ సుజాత, గోపినాధ తంగమణి, మడామ్ మేనక బృందం, సాధనబోసు బృందం, లీలా దేశాయి బృందం ఎందరో యిలా ప్రసిద్ధ నృత్యకళా

నాటుకు వేషధారణ ఫోటోలు, ఎల్లోరా, చిదంబరం, కంచి కైలాసనాథ ఆలయం తిరువణ్ణామలై మొదలైన, ఆలయాల్లో శిల్ప చిత్రాలు అన్నీ, తిలకించి, తిలకించి నాకు ఆభరణాలు, వస్త్రాలు, ముఖానికి వేసే రంగులు వీటన్నింటిలో జాగ్రత్త వహించారు.

నలుగురైదుగురు గాత్రము పాడే వారిని పలిపించి గంభీరత, మార్దవం, మాధుర్యంతో కూడివున్న ఇరువురు పాటకుల్ని ఏర్పాటు చేశారు. మద్దెల, ఫకవాజు, అల్గోజా, ముఖవీణ, యిలాంటి ప్రాచీన వాయిద్యాలే సహకారానికి ఏర్పాటు చేశారు.

ఆ రోజు కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో, ప్రేమలత శర్మ బహిన్‌జీ నా ప్రోగ్రాం ఏర్పాటు చేశారు.

సంస్కృత పండితులు - చతుర్వేదులు, త్రివేదులు, ద్వివేదులు విద్వాంసులు, శాస్త్రవేత్తలు, గాయకులు, నాట్యాచార్యులు, నర్తకులు అందరినీ ఆహ్వానించారు. అంతటి సభ అంతకు ముందెప్పుడు జరుగలేదన్నారు పెద్దలు.

బహిన్‌జీ స్టేజీ మీదకు వచ్చి ప్రారంభ ఉపన్యాసం చెప్పారు -

ఈ రోజున మనం ఒక అపూర్వ తాండవం చూస్తాం. పరమశివుడు అన్నపూర్ణమ్మ సాన్నిధ్యంలో వారు మనయీ కండ్లకు కనిపించక పోయినా సూక్ష్మరూపంలో తిలకిస్తుంటారు.

"నర్తనం - సంధ్యా తాండవం - కైలాసం వద్ద పరమశివుడు ప్రదర్శించిన అపూర్వ తాండవం, బ్రహ్మతాళం, విష్ణు మృదంగం, ఇంద్రుడు మురళి, సరస్వతీ వీణ, లక్ష్మీ దేవి గాత్రం, నారద తంబురలు సహకార గానం, ఇక సృష్టిలోని జీవకోటి అంతా ఆ నాట్యం తిలకించుటకు వేచి యుండగా - పరమశివుడు నాట్యా మాడాడు. ఎలా నాట్య మాడాడు - చూద్దాము."

అని బహిన్‌జీ ప్రక్కకు వెళ్లారు. ఫెళఫెళమని మద్దెలలు మ్రోగాయి.

'భాం' 'భాం' అని శంకము పూరింపబడింది. భేరి, నగారా, పూలబాకా విజయనాదాలు చేశాయి.

వెంటనే -

"సంధ్యాతాండవ మూర్తి
'శంకర శశిధర నమో నమో
పాలనేత్ర పరమేశ్వర పాహి
ద్రువతాళ నృత్త ప్రియ ॥
బృందగాన మారంభమైంది.

సృష్టి తాండవము
సృష్టి నుండి స్థితి
అటుపై సంహారము

ఈ మూడు తాండవాలు నేను నర్తించుట నాటి ప్రదర్శనములోని విశేషత, విశిష్టత -

అదొక నూతన అనుభవము.
అనుభూతి - చిత్రీకరణ.

ఇటువంటి విశిష్ఠత గ్రంథాల్లో చదువుట గాని ఆ భావాలకు ఆంగిక విన్యాసాలతో రూపకల్పన చేసి నర్తించుట అదే మొదటి సారి. కవులు తమ కనులకు పండగగా వుందన్నారు. గాయకులకు వీనుల విందు. విమర్శకులు వేనేళ్లతో పొగడినారు. అందరూ మంత్రముగ్ధులై నర్తనమును తిలకించారు.

మేఘ గర్జనలు, సముద్ర అలల ఘోష, వెంటనే మలయానిలుని చల్లని పిల్లవాయువుల అనుభూతి, మల్లెలు, సంపెంగలు, విరజాజుల సుమపరిమళము, నెమళుల నాట్యం, హంసల మందగమనములు హరిణముల పరుగులు, అశ్వముల దాటులు, గతిగమనములు ఒక్కటేమిటి

'ఓం' కారము నాద బ్రహ్మ నుండి

ఇన్ని రీతుల ప్రకృతి వికసించి, పుష్పించి పరిమళించి, విరాజిల్లి - విశ్వాన్ని జీవింపజేసి మరల విలయకాలానికి ఒక్కటొక్కటే ఆ పరబ్రహ్మలో లీనమైన నర్తనము పరమశివుని సంధ్య తాండవముతో నా నర్తనం ముగిసింది.

బహిన్‌జీ గురువు గారిని రంగస్థలంపైకి ఆహ్వానించారు. బ్రహ్మతేజం వుట్టిపడుతున్న గురువుగారు సభికుల ముందుకు వచ్చి నమస్కరించారు. బంగారు పువ్వులతో కలిపిన మల్లెలు, గులాబిరేకులతో మా గురువు గారి పాదాలకు పాదపూజ చేయించారు. అమ్మ హృదయం ఆనందంతో పొంగిపోయింది. బహన్‌జీ పాదాలకు ప్రణమిల్లింది. అందరూ నన్ను ఆశీర్వదిస్తున్నారు.

అందరూ చుట్టుముట్టి నన్ను అభినందిస్తున్నారు. అటుపై నేను అమ్మగురించి వెతుకుతున్నా. అమ్మ నాన్న భుజములపై వాలింది. నాన్న కండ్లు ఆనంద అశ్రువులతో నిండివున్నవి.

మరునాడు బెహన్‌జీని కలిశాము. ప్రాచీన ధ్రుపద రీతి పరిశోధన ఆమె వద్ద చేయాలని వుందని అవకాశమివ్వమని కోరాను. ఆమె ఆనందంతో అంగీకరించారు. నాటి నుండి నాన్న నా శివతాండవము యెడల ఎంతో నూతనోత్సాహం చూపుతూ వచ్చారు. నన్ను **బెనారసు** తీసుకెళ్లడానికి అమ్మ అన్ని ఏర్పాట్లు చేస్తున్నారు.

అంతలో ఒకనాటి సంధ్య సమయం - పిడుగులాంటి వార్త -

బహిన్‌జీ శాశ్వతంగా కాశీ అన్నపూర్ణ సన్నిధికి వెళ్లారని ఆమె సోదరి ఊర్మిళ శర్మ యిచ్చిన టెలిగ్రాం అందింది. అమ్మ ఆ టెలిగ్రాం చదివి అలాగే ఉండిపోయింది. ఆమె కండ్లు ఎక్కడికో చూస్తున్నాయి. నన్ను దగ్గరగా తీసుకుని గుండెలకు హత్తుకుని -

అమ్మా ఆకలి అంటే అన్నం పెట్టే తల్లివి ఈ చిన్నవానికి జ్ఞానబిక్ష పెట్టలేక పోయావా తల్లీ.. అన్నపూర్ణా... ఇక గొంతు పెగల లేక వలవలా యేడ్చింది. ఆమె కన్నీరు వరదలై నా శరీరాన్ని తడిపినవి.

ఆనాటి నుండి నాకూ విశ్వేశ్వర అన్నపూర్ణమ్మల కాశికి ఋణం తీరిపోయింది.

మా అమ్మలోని మార్పును, అమ్మమ్మకు తాతయ్యకు తెల్పాను. వారిని వచ్చి కొన్ని దినాలు వుండమని కోరాను.

ఒకరోజు ఉదయమే అమ్మమ్మ, తాతయ్య వచ్చేశారు.

అమ్మమ్మ రాక కొంత కలివిడి, వెలుగును యింటికి తెచ్చింది. ఒకరోజు అమ్మను నాన్నను కూర్చోబెట్టి -

అమ్మాయి మీకు అన్నివిషయాలు తెలుసును - అయినా చెబుతున్నా విచారించితే చనిపోయిన వారు తిరిగిరారు కదా! విచారించి లాభం ఏమిటి?

"కామాక్షి నీ ఆదర్శం కళ్యాణ్ ద్వారా తీరాలి. అది ఆలోచించాలి". అని యిద్దరిని ఓదార్చుతూ పలికింది అమ్మమ్మ.

నేను అక్కడే వున్నాను.

బాబూ కపర్దీ..

నీకు కళ్యాణ్ కపర్ది అని పేరు పెట్టింది మీ అమ్మ.

నీవు వట్టి కపర్దీవే కాదు.

మురమళ్ల వీరేశ్వరునికి నిత్య కల్యాణం. పచ్చతోరణం.

అలా నీ "తాండవం" ప్రతి నిత్యం మంగళప్రదంగా వెలుగొందాలి.

అమ్మమ్మ - మా నాన్న ప్రక్కకు తిరిగి.

బాబూ..! ఆంధ్రలో వున్న ప్రముఖ శివాలయాలన్నింటికి వ్రాయాలి.

మన బాబు చేత నాట్యం చేయిద్దాం.

ఏ పుట్టలో ఏ పాము ఉందో అని పెద్దలు అన్నట్లు ఏ శివుడు సంపూర్ణంగా ప్రసన్నుడవుతాడో, వెలుగుచూపుతాడో అన్నది.

నాన్నగారు ఆ మరునాటి నుండి ఆంధ్రలోని ముఖ్య శివాలయాలన్నింటికీ లేఖలు వ్రాశారు.

ఆలయాలన్నిటి నుండి ఆహ్వానాలందుకుంటున్నాము.

తూర్పు తీరాన ముఖ లింగ క్షేత్రం మొదలు తెలంగాణ ప్రాంతంలోని వేములవాడ

రాజరాజ్యేశ్వర ఆలయం వరకూ అనుకోవడమే. తడవుగా నాన్న అన్ని ఏర్పాట్లు చకచకా చేశారు.

**"బహిన్‌జీ ఆత్మశాంతి"** కొరకు మా నృత్యారాధన జరుపుతున్నట్లు నేను సంతృప్తి చెందాను. ముఖలింగ క్షేత్రం - మధుకేశ్వరుని సన్నిధిని ప్రారంభించాము. ఈ శివాలయం ఎంతో ప్రాచీనమైంది. ఎందరు సంధ్య వెలుగుల్లో శివగీతాలు గానం చేస్తూ నృత్త, నృత్యాలు చేశారో నేడు మాత్రం ఆ ప్రాచీన వైభవాన్ని గోల్పోయి శూన్యంగా నాకు తోచింది. ఈ శతాబ్ద కాలంలో మరల నాదే మొదటి తాండవమేమో? అనుకున్నాను.

అక్కడ నుండి మురమళ్ల వెళ్లాము. మురమళ్ల వీరేశ్వరుని ఆలయంలో నాకు కల్గిన ఒక విచిత్ర అనుభవం. ఆ స్వామికి నిత్యమూ కల్యాణం జరుగుతుంది.

పూర్వం ఆ వివాహ వేడుకల్లో నృత్య వినోదముండేదట. అర్ధ శతాబ్ధిగా నృత్యం ఆగిపోయింది. ఆ ఆలయంలో నృత్యం చేసిన ఒక నర్తకి వరహాలు - ఆమెకు సుమారు తొంబై సంవత్సరాల వయస్సు ఉంటుంది. ఆమె సర్వమూ పరిత్యాగము జేసి కాషాయి దుస్తులు ధరించి సన్యసించి ఋషికేశంలో ఒక యోగీశ్వర ఆశ్రమంలో వుంటుంది. సంవత్సరానికి ఒకసారి తన స్వామి దర్శనం కొరకు వస్తుంది.

నేను నృత్య పూజ చేసిన రోజున ఆమె అక్కడే వున్నారు. నా అదృష్టవశాత్తు నా నృత్యం చూడ్డానికి వచ్చారు. ఆమె కడువృద్ధురాలైనా ఆరోగ్యవంతంగా వున్నారు. చేతిలో జపమాల రుద్రాక్షమాల తిప్పుతూ శివనామం స్మరిస్తూ సభలో ముందు వరుసలో కూర్చొని వున్నారు.

నేను నృత్యమాడి ముగించాను "బాగుంది చిరంజీవి మా స్వామి చాలా కాలం తరువాత నృత్యం జూచాడు. నిస్వార్థంగా కళాసేవ చేయాలి. ఏమి కోరి నేను ఆ స్వామికి జీవితం అర్పించి, సేవ జేశాను. కళల పవిత్రత, కళాకారుల త్యాగం తెలియని ఈ కాలం పెద్దలు కళను నిరసించారు. అపవిత్రంగా చిత్రించారు. ఆనాడే నేను సన్యసించి ఈ దేశం విడిచి ఋషికేశం పోయాను.

నేనేమి యివ్వగలను నీకు చిరంజీవి -

"ఇదుగో - నా చేతిలోని యీ రుద్రాక్షమాల కొన్ని లక్షల జపం చేసింది. నీకు యిస్తున్నాను" అని ఆమె చేతిలోని రుద్రమాల నా మెడలో వేశారు.

అక్కడ నుండి పలివెల కొప్పేశ్వర, ద్రక్షారామం, క్షీరారామం మొదలైన పంచారామాలు ఎన్నో సందర్శించాము.

క్షణముక్తేశ్వర ఆలయంలో కల్గిన ఒక దివ్యానుభూతి తెల్పుతాను. ఒక క్షణకాలం - సర్వమూ మరిచి - ఈ - ఈశ్వరుని ధ్యానం జేస్తే లేక జపిస్తే ముక్తి నిస్తాడు.

కపర్దీ యీ స్వామిని జపించు. నీ జన్మ తరిస్తుంది. అని అమ్మమ్మ మరీ మరీ చెప్పారు.

ఆ రోజు అక్కడ స్వామి సన్నిధిని 'గిరిజాశంకరుల' ద్వంద్వ నృత్యం - ప్రదర్శించాను.

ఆ నాట్యం - అదొక అతీత దివ్యానుభూతి.

ఆ నాట్యం చేసినంతసేపు నేను ఒంటరిని గాను.

నాలో అంతవరకు యిమిడి వున్న ఒక దివ్యశక్తి నా నుండి వేరువడి నా పక్కనే - నా సరసనే నాట్యమాడుతున్నట్టు నేను తాండవం చేస్తుంటే - ఆ శక్తి నాకు పోటీగా లాస్యం సల్పుతున్నట్లు వివిధ అనుభూతులు కల్గినవి. నన్ను నేమరిచి తాండవ-లాస్యాలు; లాస్యతాండవాలు ప్రదర్శించాను. అమ్మ ఆ రాత్రి నా నాట్యం దీక్షతో జూచారు. మరునాటి ఉదయం నన్ను పిలిచి -

అమ్మ కోర్కె ఫలించింది.

**"నీ నాట్యంలో తాండవ శక్తి (పురుషశక్తి) శివరూపం - లాస్య శక్తి (స్త్రీ శక్తి) అంబరూపం రెండూ జూచాను."**

నీవు సంపూర్ణ కళాకారుడవు అయ్యావు.

లౌకికంగా తలంచితే నిన్ను మించిన కళాకారులుండరు.

ఆధ్యాత్మకంగా జీవితాన్ని మలుచుకుంటే జన్మ తరించే మార్గం దొరికింది. ఆకాశం

నుండి నీ నాట్యం తిలకిస్తూ దేవతలు నీ మీద అమృతాన్ని కురిపించారు. ధన్యుడవురా కల్యాణ్ - ఇలారా కపర్దీ - అని అమ్మమ్మ నా పాదాలు స్పృజించబోయింది. నేను ఆమె కాళ్లపై వాలిపోయాను.

**అమ్మమ్మ:** నీకొక చక్కని చుక్కని వెదికి కల్యాణం చేయాలి రా నాన్న కల్యాణ్.

**నేను:** అమ్మమ్మా నాకా? కళకే అంకితమన్నారుగా, అమ్మ.

**నేను:** ఏమి చేసుకోవా?

శ్రీరామకృష్ణ పరమహంస, శారదామాయిని చేసుకో లేదా?

x x x

మా నాన్న బాల్య స్నేహితుడొకరు కలకత్తాలో రైల్వేలో పెద్ద ఉద్యోగంలో వున్నారు.

అతనికి యిద్దరు పిల్లలు. పెద్దవాడు కంప్యూటర్ నేర్చుకుని అమెరికాలో పెద్ద ఉద్యోగం చేస్తున్నాడు. "రేఖ" వారి కుమార్తె బి.ఎ. చదువుతుంది.

కలకత్తాలో భరతనాట్యం నేర్చుకుంటుందట. చాలా అందమైన అమ్మాయి. ఆమె నాట్యం భంగిమలు కొన్ని ఫోటోలు పంపారు.

నా గురించి నా నాట్యం గురించి తెలుసుకున్నారట. నేను గూడా కంప్యూటర్ నేర్చుకున్నట్లు తెలుసుకున్నారట. రేఖను నా కిచ్చి వివాహం చేయాలనుకుంటున్నారట, వివాహమయిన తరువాత యిద్దరిని అమెరికా పంపుతారట కాబోయె మామగారు.

ఉత్తరము జూచి నాన్న చాలా చాలా సంతోషించారు. కపర్ధి యిష్టం - అని అమ్మ అన్నారు. అమ్మమ్మ కలకత్తా ప్రయాణం తేదీలు నిర్ణయంలో నిమగ్నమయ్యారు.

కొద్ది నిమిషాలు తరువాత..

నేను అక్కడి నుండి లేచి నా గదిలోనికి వెళ్లాను.

టేబుల్ మీద నటరాజ మూర్తి విగ్రహం పాదాల వద్ద మురమల్లలో "వృద్ధ కళాతపస్విని" ఇచ్చిన రుద్రాక్షమాల ఉంది. ఆ విగ్రహం ముందు కొద్ది నిమిషాలు ఆ విగ్రహాన్ని తథేకంగా చూస్తూ కూర్చున్నాను.

ఇన్ని దినాలుగా నాలో యిమిడి ఉన్న "లాస్యం" స్థానం వేరొకరికి అర్పింపడానికి నా మనస్సు అంగీకరించలేదు. నా నాట్యం డ్రెస్‌ల అల్మారా తెరిచాను. అందులోని కాషాయి వస్త్రాలు తీశాను.

కాషాయ దోవతి. లాల్చి ధరించాను. చేతిలో రుద్రాక్షమాల తీసికొని కళ్లకు అద్దుకొని గుమ్మం దాటి బయటికి వచ్చి ప్రశాంతంగా కూర్చొని వున్న అమ్మ పాదాలకు నమస్కరించాను.

అమ్మ నేత్రాలు అశ్రువులతో మెరిసాయి.

ఆ ఆనంద భాష్పాలు నన్ను ఆశీర్వదించాయి.



ఈ చిన్న గ్రంథం చదివినప్పుడు నా శిష్యుడు దేవుడు హృదయం ఆలపించిన చిన్ని గీతం

"అమ్మకున్న ఆరాటం నీ పైన అందరికి ఉంటుందా ఓ నాన్న!
అందరికి ఉంటుందా నా చిన్ని కన్నా!
లాల పోసి జోల పాడి గోరుముద్దలెన్నో పెట్టి
జో-నాన్న-బజ్జో-అంటూ.. బుజ్జగించి నిదురపుచ్చే..."

